సర్వస్వామ్యసంకలితము
ప్రతులు ౫౦౦

# ప్రకటన

నాచేరచియింపఁబడిన యీదిగువనాటకములు త్వరలో ముద్రితములై యాంధ్రసోదరుల కరముల నలంకరింపఁగలవు.

## ౧. సుచంద్ర

ఇందలి యితివృత్త మతివిచిత్రమైనది. శృంగారరస రంజితము.

## ౨. వీరబభ్రువాహన

భారత కథ – వీరరసాలంకృతము.

ఈ నాటకమునకు శ్రీ ఉ. వే. శ్రీమాన్ బాలకవి, మధురకవి, ప్రౌఢకవి, సంగీతవిద్వాన్, పంచాంగం వేంకట రామానుజాచార్యులుగారు పీఠికయు, నాందీ ప్రస్తావనలున్ను ప్రేమపూర్వకముగా వ్రాసి యొసంగియుండిరి.

గ్రంథకర్త.

శ్రీరస్తు

# శ్రీ చన్నకేశవ శతకము

గ్రంథకర్త:

శ్రీ. ఉ. ప్ర. శ్రీమాన్

**నారాయణం రామానుజాచార్యులు**



ఇయ్యది

శ్రీ. ఉ. ప్ర. శ్రీమాన్

దేవయజనం వేంకటరామాచార్యులుగారి

ద్రవ్యసహాయమున

ముద్రింపించి

ప్రకటింపఁబడియె.

ఉల్లిపాలెం.

1944

# తొలి పలుకు

మాపురి నెలకొనియున్న దేవదేవుండగు శ్రీ చన్నకేశవుని పదపద్మంబులందీశతక సుమాంజలి సమర్పింపఁబడెను. ఇందలి మకరందము భక్తిరసమే దీనిం గ్రోలువారు శ్రియఃపతిని మాసక్త చిత్తులగు భక్తులు, కాన, వారికై మధుపానమున కాహ్వానించుట నిరర్థకమే, ఆ చంచరీకములను దోషపరిహారమున కర్థించుటయు ననవసరమే యని విరమించుచుంటిని.

కారణ
క్షేత్రము

ఇట్లు
గ్రంథకర్త,
నారాయణం రామానుజాచార్యులు.
ఉల్లిపాలెము.







చిత్తసుమభృంగ ♦ సింధురావద్భ్యంగ
కరుణామయాపాంగ ♦ ఖగశతాంగ
నీలనీరదగాత్ర ♦ నిగమవేద్యచరిత్ర
సుమహితనుతిపాత్ర ♦ కమలనేత్ర
భుజగాధిపతితల్ప ♦ నిజదాసజనకల్ప
ధృతసత్యసంకల్ప ♦ హతవికల్ప
భవతూలవాతూల ♦ పరిపాలితకుచేల
మునిజనహృల్లోల ♦ కనకచేల

తే. గీ॥ కుందకుట్మలరదన పూ ♦ ర్ణేందువదన
సకలనిర్జరగణశస్త ♦ చక్రహస్త
సురుచిరవిలాస లసునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ.

తే॥ గీ॥ శేషతల్పము రవికాంతి ♦ చిమ్ముదర్ప
ప్రేంఖ సాక్షాత్కరించు వ ♦ రాలకుప్ప
సురుచిరవిలాస లసునాఖ్య ♦ పురనివాస
చెన్నకేశవదేవ వి ♦ శాలభావ. 5

సీ॥ చూడామణిప్రభా ♦ సులలితపింఛావ
తంసంబు తళతళ ♦ త్రవహింప
కస్తూరికాతిల ♦ కాభిరామంబైన
నగుమోము చందురు ♦ బిగువడంప
వరదాభయప్రభాంగ ♦ వాగ్ధిజాంచిత చతు
ష్కరములు దేవతా ♦ తతులనొంప
హారాంశుకంబులు ♦ ద్యుత్కోటి చండాంశు
మండలాహంకృతు ♦ ల్మాపిపంప

తే॥ గీ॥ పదములంబుజగర్వ సం ♦ పదల గ్రుంప
మ్రోలవేంచేయు నామొఱ ♦ లాలకింప
సురుచిరవిలాస లసునాఖ్య ♦ పురనివాస
చెన్నకేశవదేవ ♦ విశాలభావ. 6

సీ॥ బలిదానవుని ద్రొక్కి ♦ పాతాళభూమికిఁ
బంపునప్పుడు నొప్పి ♦ పట్టెనేమొ
అభివాదవేళలం ♦ దజరుద్రవరాళి క
ర్కశరత్నములుదాకి ♦ కందెనేమొ
సామజేంద్రుని గావ ♦ సత్వరంబుగఁ దాము
వేంచేయ బడలికఁ ♦ గాంచెనేమొ

ఘనసైరిభాసిషం ♦ జరము సంబరవీథి
కెగఁదన్ను నా బాధ ♦ దగిలె నేమొ

తే॥ గీ॥ దేవదేవాధిదేవ నీ ♦ దివ్యచరణ
నీరజంబులకొత్తఁగ ♦ నిమ్ము రమ్ము
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ.

సీ॥ వైకుంఠమాధవ ♦ వాసుదేవ ముకుంద
నారాయణజనార్ద ♦ నాబ్జనాభ
దామోదరానంత ♦ దైత్యాంతకతమాల
శ్యామలాకార సం ♦ సారదూర
వనధికన్యాపరి ♦ ష్వక్తవక్షోభాగ
భాగీరథీజాని ♦ భాగధేయ
నతశేషశేషాశ ♦ నాఙ్కితపదజల
జాత హృషీకేశ ♦ చక్రహస్త

తే॥ గీ॥ అనుచు జాగ్రదవస్థయం ♦ దహరహంబుఁ
దలఁతుఁ గలనైనఁ గన్పింప ♦ వలదె తండ్రి
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. ౬

సీ॥ క్షీరపాథోధి గం ♦ భీర తరంగ ని
నాదంబుచేఁ జెవి ♦ నాటలేదొ
సురవారకామినీ ♦ వరనృత్తశింజితం
బుల లీనమై వినం ♦ గలుగలేదొ

చతురాననాది ని ♦ ర్జరబృంద జయజయ
ధ్వనులచే గాసిఁ జేసి ♦ విసఁగలేదొ
పర్యంకభూతాహి ♦ పతితీవ్రవిశ్వాస
పవనంబుచేఁ జివిఁ ♦ బడఁగలేదొ
తే॥ గీ॥ ఇంత మొఱవెట్టుచున్నఁ గా ♦ సంతమైన
విన్నచోఁ బలుకుంగ వే ♦ కన్నతండ్రి
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 9

సీ॥ రామశ్యామలమేఘ ♦ కోమలదీప్త్యభి
రామ సీతామన ♦ స్సీమకామ
కామకోటివిలాస ♦ కలికల్మషవిరాస
భువనమోహనరాస ♦ భుజగవాస
వాసవమదహార ♦ వైనతేయవిహార
నవనీతచోర దు ♦ ర్ణయవిదూర
దూరవీక్షణవేద్య ♦ వీరయూథాభేద్య
సవనఖండితచైద్య ♦ సాధుహృద్య
తే॥ గీ॥ హృద్యభవమగ్నవైద్య సం ♦ పద్యమాన
సద్యశఃపుంజ కలితావ ♦ వద్యవిద్య
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 10

సీ॥ వాల్మీకి దేవర ♦ వారి కీర్త్యంశము
ల్వ్యాపించి పరమని ♦ ర్దోషుఁడయ్యె

శుకయోగివర్యుఁడీ ♦ శుద్ధమైన నీకథ
లెప్పుతించి షడ్వర్గ ♦ విజయుఁడయ్యె
వర్ణించి మీదివ్య ♦ వైభవం బక్రూరుఁ
డమరదుర్లభపదం ♦ బధిగమించె
శ్రీవిష్ణుచిత్తు మీ ♦ సేవ్యత్వమును జాటి
చెప్పి సంసృతివార్ధిఁ ♦ దప్పఁగొనియె

తే॥ గీ॥ నిపుడు నాపిచ్చివ్రాతలే ♦ మిచ్చునట్లు
పూనిచేయింపఁదలచితో ♦ బుద్ధియందు
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్న కేశవదేవ వి ♦ శాలభావ.

సీ॥ అసురబాలుని యార్తి ♦ నాలించి యాయస
స్తంభమందుననిల్వఁ ♦ దరలలేదె
సర్వలోకశరణ్య ♦ సన్నిధిఁ గృపసేయు
మనవిభీషణు దయం ♦ గనఁగలేదె
మొఱవినినంతనే ♦ బిఱబిఱ చనుదెంచి
కరినాథు నర్మిలి ♦ గావలేదె
అఖిలేశమాంపాహి ♦ యని ద్రుపదాత్మజ
చింతింపఁ గరుణ ♦ వీక్షింపలేదె
పతిపరిభూతయై ♦ పరమాత్మ గావవే
యన నహల్యను బ్రీతిఁ ♦ దనుపలేదె
ఓకృపానిధి నీవె ♦ నాకు దిక్కని ధ్రువుం
డర్థింప నతనికై ♦ యరుగలేదె

తే॥ గీ॥ అంత కరుణార్ద్రహృదయుండ ♦ వయ్యు నెంత
వేఁడుచున్నను రక్షింప ♦ వేమి తండ్రి
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 12

సీ॥ హరినామకీర్తన ♦ హర్యక్షరవముచే
సమయవే పాపౌఘ ♦ సామజములు
మురవైరి పదభక్తి ♦ పరిశుధారాహతిఁ
బడకుండునే విప ♦ త్పాదపములు
వనజాక్షుదివ్య స ♦ పర్యానిలంబుచేఁ
బాయవే కామాది ♦ తోయదములు
చక్రహస్తుకథాప్ర ♦ సంగకీల దహింపఁ
జాలదే సంసార ♦ తూలరాశి

తే॥ గీ॥ ననుచు నీభక్తు లనిశంబు ♦ నభినుతింప
వినినవాఁడైన లోకమం ♦ దనఘుఁడౌను
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 13

సీ॥ సకలదైత్యవితాన ♦ సామజహర్యక్ష
పాండవపక్ష శ్రీ ♦ వత్సవక్ష
కరుణాకటాక్ష ని ♦ ర్జరసంచయాధ్యక్ష
నవనీరజాతాక్ష ♦ భువనరక్ష
ధృతసత్యదీక్ష ♦ నిర్జితజాతరూపాక్ష
హితనిటలాక్ష భం ♦ జితమహోక్ష

ఘనశిరోరుహపక్ష ♦ వనధిశిక్షణదక్ష
శృంగారవీక్ష సం ♦ ద్భంగరూక్ష
తే॥ గీ॥ కృతమహర్షి సతీశాప ♦ గతివిమోక్ష
దయఁగనంగదె భక్తమం ♦ దారవృక్ష
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 14

సీ॥ అజసూతిమానసాం ♦ బుజకర్ణికాంతరం
బునఁజిక్కి మార్గముం ♦ గనఁగలేదొ
ప్రహ్లాదు దృఢతరం ♦ బగుభక్తి సంకెల
బ్బంధింపఁ గదలఁగా ♦ వలను లేదొ
అంబరీషుధ్యాన ♦ శాంబరీ మహిమచేఁ
గలవరపడి దిక్కుఁ ♦ గానలేదొ
శ్రీ పరాశరమహా ♦ శేఖరు హృత్పాశ
బంధంబు విడఁదీయ ♦ బలములేదొ
తే॥ గీ॥ ఇట్టి ప్రత్యూహములు లాగి ♦ పట్టుకున్న
సేవసాయింప నశ్రద్ధఁ ♦ జేయఁగలవె
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 15

సీ॥ ధీరమహావీర ♦ కారుణ్యరసపూర
నిగమాంతసంచార ♦ నిర్వికార
బుధజనమందార ♦ పోషిత సురవార
కౌస్తుభమణిహార ♦ కలివిదార

మానితశతకోటి ♦ మన్మథాకార శ్రీ
రాధికాధరబింబ ♦ రాజకీర
వల్లవీజనచిత్త ♦ వైభవాలంకార
యమునావనవిహార ♦ యదుకిశోర
తే॥ గీ॥ జలధిగంభీర మేఘమే ♦ చకశరీర
నన్నుఁ జేకోర త్రిభువనా ♦ పన్నివార
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 16

సీ॥ గతినీవెరమ్ము మా ♦ పతివైతి వికలెమ్ము
కోరికలిమ్ము భ ♦ క్తులదె సొమ్ము
దయఁగనంగదె మమ్ము ♦ దాసులమతివమ్ముఁ
జేయకు ననునమ్ము ♦ సిరులఁదెమ్ము
మమ్మాదుకొమ్ము నీ ♦ మహిమను భువిఁజిమ్ము
మహితయశమ్ముఁ గా ♦ పాడుకొమ్ము
సకలకష్టౌఘమ్ము ♦ సమయింపఁ జాపమ్ము
ననుగూర్పుము శరమ్ము ♦ వినయమిమ్ము
తే॥ గీ॥ ఘనగుణంబులప్రోడవు ♦ గమ్ముఁ మమ్ము
భూరిసుఖములఁ దేల్చు మ ♦ నారతమ్ము
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 17

సీ॥ నియతదయాపాంగ ♦ నీలమేఘశుభాంగ
చికురోపమితభృంగ ♦ నికరరంగ

కనదరాతివిభంగ ♦ వనధికన్యాసంగ
ఘనసుగుణోత్తుంగ ♦ ఖగతురంగ
శర్వధనుర్భంగ ♦ శయనీకృతభుజంగ
జితసహస్రాసంగ ♦ ధృతరథాంగ
భార్గవోన్నతిభంగ ♦ పాలితమాతంగ
జాతరూపమయాంగ ♦ సత్ప్రసంగ

తే॥ గీ॥ దళితకలికాలతిమిరప ♦ తంగమంగ
ళోత్తమానంతమణికిరీ ♦ టోత్తమాంగ
సురుచిరవిలాస లసునాఖ్య ♦ పురనివాస
చన్న కేశవదేవ ♦ విశాలభావ. 1

సీ॥ ఇందిరాసతిమూపు ♦ నందొక కేలుండ
నొకట లీలాంబుజం ♦ బూఁగుచుండ
సిగఁజుట్టఁజాలని ♦ చికురబృందము గండ
భాగంబులను నాట్య ♦ మాడుచుండ
మందస్మితం బింద్ర ♦ మణిపర్వతముదండఁ
బండువెన్నెలపసల్ ♦ చెండుచుండ
కౌస్తుభమాణిక్య ♦ కలితవజ్రపుదండ
యుద్యదర్కశతంబు ♦ నొంచుచుండ

తే॥ గీ॥ మందమారుతకంపిత ♦ మా శిఖండ
దామమాదలసుప్రభల్ ♦ దనరుచుండ
నెదుట సాక్షాత్కరించు నా ♦ మదికినిండ
ప్రముద మొనఁగూడఁ బాలిత ♦ పద్మజాండ

సురుచిరవిలాస లసునాఖ్య ♦ పురనివాస
చన్న కేశవదేవ వి ♦ శాలభావ. 19

సీ॥ సర్వలోకాధార ♦ గర్వితారివిదార
జితమన్మథాకార ♦ శ్రుతివిహార
కాలాంబుధరగాత్ర ♦ కమలా ప్తశశినేత్ర
శివనుతచారిత్ర ♦ శ్రీకళత్ర
దీనరక్షణదక్ష ♦ మానితమునిపక్ష
కౌస్తుభమణివక్ష ♦ ఖలవిపక్ష
తిలసుమసమనాస ♦ దీ ప్తకాంచనవాస
కమనీయదరహాస ♦ కలినిరాస

తే॥ గీ॥ పూర్వభవసూృత వసుదేవ ♦ పుణ్యజాల
భువనమోహన చిద్రోద్ధవ ♦ పుండ్రఫాల
యేల మమ్మేల జాగు గో ♦ పాలబాల
సురుచిరవిలాస లసునాఖ్య ♦ పురనివాస
చన్న కేశవదేవ వి ♦ శాలభావ. 20

సీ॥ భవభయంబులకు మీ ♦ భ క్తిభావమె మందు
వనధిజగలదు నీ ♦ వక్షమందు
ననితరసౌలభ్య ♦ మైన యశంబాదు
సర్వేశ పదునాల్గు ♦ జగములందుఁ
బాండవేయుని ప్రాణ ♦ పరిరక్షణమునందుఁ
బ్రతినఁబూనితి ధర్మ ♦ సుతునిముందు

కుబ్జ చందనమిచ్చి ♦ కోరెను మీపొందుఁ
గన్పింపరాదె ని ♦ గ్గనులఁగందు

తే॥ గీ॥ వెతకిచూచిన నీసాటి ♦ వేల్పు లెందు
నందు రఖిలంబు నీవె మా ♦ కిందునందు
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 2

సీ॥ ఘనభుజాంతరసీమఁ ♦ గాపురంబుండిన
లక్ష్మి నిశ్చలతటి ♦ ల్లతికగాఁగ
నను నమ్మియున్నచోఁ ♦ గనరఘౌఘంబను
శ్రీసూక్తిసాంద్ర గ ♦ ర్జితముగాఁగ
నంగదకోటీర ♦ హారప్రోతవిచిత్ర
మణిరుచుల్బలవైరి ♦ ధనువుగాఁగ
జితతమాలశ్యామ ♦ లతమైన తిరుమేని
ప్రభమృదుప్రావృడ ♦ భ్రంబుగాఁగ

తే॥ గీ॥ వేగవేంచేసి భవదను ♦ రాగవృష్టి
సల్పి మత్స్వాంతసస్యశో ♦ షణ మడంప
రాదె రారాదె యనుకంప ♦ లేదెవాదె
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 22

సీ॥ అపరాధియనక కా ♦ కాసురుం దయఁజూచి
కీర్తినొందితివన్న ♦ కింవదంతి

మలినవర్తనుఁడైన ♦ మాలిని యనువానిఁ
గైకొంటివనెడు నీ ♦ ఘన యశంబు
ఆజన్మపాపిష్ఠుఁ ♦ డైన యజామిళు
రక్షించితివను పు ♦ రాణగాథ
సంగనాలంపటుం ♦ డై మలిమ్లుచుఁడైన
యజ్ఞదత్తుఁ బ్రోచి ♦ నట్టివార్తఁ

తే॥ గీ॥ గల్లగానెంతు మమ్మేల ♦ నుల్ల ముల్ల
సిల్ల వేంచేయకున్న శ్రీ ♦ వల్లభవిను
సురుచిరవిలాస లసునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 23

సీ॥ వాత్సల్యమున నీకు ♦ వన్నెఁ గూర్చినవాఁడు
ప్రహ్లాదుఁడేగదా ♦ పద్మనాభ
అభయదానమున నీ ♦ యశము నిల్పినవాఁడు
రావణానుజుఁడెగా ♦ రఘుకులేంద్ర
ఆర్తిహరత్వమం ♦ దలగజనాథుఁడే
గద పేరుదెచ్చిన ♦ ఘనగుణాఢ్యుఁ
డౌదార్యమునఁ బెద్ద ♦ యని లోకములలోనఁ
జాటిచెప్పినది పాం ♦ చాలిగాదె

తే॥ గీ॥ పతితపావన బిరుదంబుఁ ♦ బట్టుపట్టి
జగతినిల్పుట నాబోటి ♦ జనులుగారె
సురుచిరవిలాసె లసునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 24

సీ॥ శరణాగతత్రాణ ♦ బిరుదంబునకు హాని
గల్గు నాపై దయ ♦ గలుగకున్న
నఖిలపాపధ్వంసి ♦ వని బలుకఁ డొకఁడైన
నసదృశభక్తి నా ♦ కొసఁగకున్న
నాపదుద్ధారకుం ♦ డను యశోవిభవంబుఁ
గల్లగానెంతు న ♦ న్నేలకున్న
సకలలోకారాధ్య ♦ చరణుండవను పల్కు
మిథ్యయా దర్శన ♦ మాయకున్న

తే॥ గీ॥ వాదమిక నేల నేను నీ ♦ వాఁడనన్నఁ
గినిసి కరుణింపకున్న నీ ♦ కీర్తిసున్న
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ.

సీ॥ నిరతాన్నగోదాన ♦ నిష్ఠలౌ మనుజులఁ
గరుణింప నీకెంత ♦ ఘనతగల్గు
వేదవేదాంతార్థ ♦ విదులఁ జేరఁగఁదీసి
ప్రోచిన నీకేమి ♦ పొసఁగు కీర్తి
ప్రొద్దు నీనామ ♦ మేమఱక జపించు
భక్తులఁగాచుటే ♦ పాటిగుణము
సుతసతీహితదూర ♦ మతులఁగాచిన నీకుఁ
దిరమౌను పేరుప్ర ♦ తిష్ఠ లరయ

తే॥ గీ॥ కాచినను నన్ను నాబోటి ♦ కఠినమతులఁ
గావవలె పేరురావలెఁ ♦ గాక నీకు

సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ 26

సీ॥ నిర్భయంబుగ దాస ♦ నివహంబు నినుఁ జేర
కుండఁ బెన్బాముపైఁ ♦ బండినావు
సిగ్గుచే నెవరు నీ ♦ చెంతఁజేరరటంచు
దార నురంబునఁ ♦ దాల్చినావు
శరణార్థు లనిశంబు ♦ నరుదెంతురను భీతి
నడిసంద్రంబులో ♦ విడిసినావు
అండనుండినవాఁడు ♦ గుండె ఝల్లనిపోవ
భూతనాథుని మైత్రిఁ ♦ బొందినావు

తే॥ గీ॥ సీకు నీవాచుఁ దిరుగాడ ♦ నేర్చినావు
కన్నులకుఁ జూపవైతి పీ ♦ వున్నతావు
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 27

సీ॥ మాటిమాటికి బొంకి ♦ మహిఁ జరించెదు నతి
కాముఁడవు దుపకారి ♦ కాఁగలండె
మెవ్వేళలను భోజ ♦ నేచ్ఛతోఁ దిరుగాడు
బహువశివలన యే ♦ పనులు ముగియు
నతివాంఛితాడనం ♦ బైన రసోచితం
బేయను స్త్రీలోలుఁ ♦ డేమిసేయుఁ
బరమపతివ్రతా ♦ భంగకరుండైన
పూరుషుఁ డేపాటి ♦ బుద్ధిశాలి

తే॥ గీ॥ అన్నిగుణములు శ్రీవారి ♦ యందుఁగలవు
గాన నెటుప్రోతువని నమ్మ ♦ కంబు నాకు
సుఘుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ.

సీ॥ అతికాముకుఁడవౌట ♦ కితర సాక్ష్యములేల
చాల్గొల్లపడుచుల ♦ జవ్వనంబు
బహ్వాశివనుటకై ♦ ప్రబలసాక్ష్యముగాదె
నిఖిలలోకములున్న ♦ నీయుదరము
స్త్రీలోలుఁడని చాటి ♦ చెప్పుటకై పారి
జాతాపహరణంబు ♦ చాలదొకొ-
ధరసతీవ్రతభంగ ♦ కరుఁడవౌటకు సాక్ష్య
ముల్గావె నీశిలా ♦ మూర్తు లరయ

తే॥ గీ॥ ఇంతఘనుఁడవు నీవని ♦ యే నెఱుంగు
దైన విడనాడఁజాల నీ ♦ యంఘ్రియుగము
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 2

సీ॥ అటుకులుదిని కుచే ♦ లాఖ్య భూసురవర్యు
నకుఁగూర్చితైశ్వర్య ♦ నికరములను
భక్షించి యెంగిలి ♦ పండులాశబరికి
వశముఁజేసితివి కై ♦ వల్యపదవి
నలువదినాల్గు వి ♦ ద్యల నభ్యసించి సాం
దీపనిసుతుఁదోడి ♦ తెచ్చిపెట్టి

తటవీప్రదేశమం ♦ దన్న మర్పించిన
మునిపత్నులకు భక్తి ♦ ముక్తు లిడితి
తే॥ గీ॥ యెవరిఁ బ్రోచితో ప్రతిఫల ♦ మేమిలేక
లంచగొండివె నీవెప్పు ♦ డెంచిచూడ
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్న కేశవదేవ వి ♦ శాలభావ. 30

సీ॥ నిజసోదరినిబట్టి ♦ విజయు రక్షించితి
వంతియేగాని యిం ♦ కెంత కరుణ
తల్లిదండ్రులచెఱఁ ♦ దప్పించుటకుఁ గంసు
నడఁచితి వదియు భ ♦ క్తావనంబె
జాయాపహరణ రో ♦ షముచేతఁ బౌలస్త్యుఁ
బరిమార్చి తది జగ ♦ ద్భద్రగుణమె
బాణునికరములం ♦ బడఁద్రుంచి పౌత్రుని
గొనివచ్చుటెంత లో ♦ కోపకార
తే॥ గీ॥ మహహా నీకైనవారల ♦ నాదరింతు
వెవరు నీగుట్టుఁ దెల్పరీ ♦ విశ్వమందు
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్న కేశవదేవ వి ♦ శాలభావ. 31

సీ॥ వావిఁదప్పిఁగటింప ♦ వలదని మేనత్త
మొత్తుకొన్నను బోని ♦ మొరటుతనము
వినుగాలయవనుండు ♦ నిలుమని పైకొనఁ
బఱువిడిచినప్పటి ♦ పిఱికితనము

విందారగించి సం ♦ క్రందను వీటిలో
ద్రోహివై చేసిన ♦ దొంగతనము
నవమానమనక వ ♦ ల్లవకామినుల పొందుఁ
గోరి చరించిన ♦ కొంటెతనము
తే॥ గీ॥ గుట్టుగానుండె నన్ను జే ♦ పట్టవేని
బట్టబయలుగఁజేతు నీ ♦ బెట్టు విడుము
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 32

సీ॥ పల్మాఱుమగధాధి ♦ పతి పోరఁదఱిమిన
నెన్నఁడువిడవు నీ ♦ కున్న బెట్టు
అన్నులమిన్న నీ ♦ సన్నుతాంగికి మ్రొక్కి
చెడకయుంచితివి నీ ♦ చెంతఁ గుట్టుఁ
బరులువిన్నను నవ్వ ♦ దురని లోలో మ్రింగి
తిరిగెదుబృందచేఁ ♦ దిన్నతిట్టు
నారడిఁబుచ్చితి ♦ వాపగాతనయుపై
నల్గిచక్రముఁ బూన ♦ ననిన యొట్టు
తే॥ గీ॥ రట్టుఁజేయరె యితరుఁడై ♦ నట్టులైన
స్వామివైనందుచే నీకు ♦ సాగిపోయె
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 33

సీ॥ రాకపోకలెఱుంగ ♦ రాక వర్తిలుచుందు
భార్యగల్గినవాని ♦ బ్రతుకదెంత

నిష్ఠాత్ములనుఁబట్టి ♦ నిరతము బాధించు
తనయుఁడబ్బినవాని ♦ ఘనతయెంత
నిమ్నాభిముఖియగాచు ♦ నిచ్చలుఁదిరుగాడు
కూఁతురుండినవాని ♦ గొప్పయెంత
గ్రామదాహకుఁడౌ ది ♦ గంబరితో మైత్రి
సల్పుచుండెడివాని ♦ సరసమెంత

తే॥ గీ॥ వరుసనివియన్ని యేలిన ♦ వారియందె
కలవు కల్గిన భువనైక ♦ కర్త వనిరి
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 34

సీ॥ హాలముసలంబుల ♦ నన్న భాగము వైచి
పంచాయుధములు గ్ర ♦ హించినావు
అసితాంబరమునీది ♦ హాటకాంబరము నా
దనుచు నేర్పునఁ జెపితి ♦ వన్న కీవు
నాభాగమనుచు ర ♦ త్నాకరంబుననుండి
యొసఁగితిపురినన్న ♦ కొక్కతావు
సామాన్యమణిహార ♦ సామగ్రి సహజున
కొసఁగి కౌస్తుభముఁ గై ♦ కొంటి వీవు

తే॥ గీ॥ నిన్ను సాదృశ్యముగ నెవ్వఁ ♦ డెన్నఁబోవు
దాయువిభజనమందు నా ♦ తప్పఁగావు
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 35

సీ॥ నారీసురా తాటకం ♦ బోరఁ గూల్చిననాఁడె
నీతిమార్గాసక్త ♦ రీతి తెలిసె
మారుతి రారాజు ♦ పోరాడునాఁడె నీ
ధర్మైక పక్షపా ♦ తమ్ము తెలిసె
మున్నిచ్చి కల్పభూ ♦ భుజము మ్రుచ్చిలునాఁడె
దానశౌండత్వ మం ♦ తయును దెలిసె
పాండునందన దౌత్య ♦ పదవినందిననాఁడె
సర్వాతిశాయిత్వ ♦ సరణి తెలిసె

తే॥ గీ॥ లోకముల కెల్ల నిన్నిప్పు ♦ డేకతమునఁ
దెలిసి ప్రార్థించి బ్రతుకుటో ♦ తెలియవలసె
సురుచిరవిలాస లకునాఖ్య ♦ పురనివాస
చన్న కేశవదేవ వి ♦ శాలభావ. 3

సీ॥ సుతుఁడెంతసుకృతియో ♦ మతిమంతులకు నల్ప
జీవితంబు ఘటింపఁ ♦ జేయుచుండు
సతియెంతనిర్దయా ♦ శాలినియో కోవి
దులు వేడఁ జూడకఁ ♦ దోలఁగుచుండు
కోడలెంతటి మహా ♦ కుత్సితాత్మయొగాని
కలవారిఁజూచినఁ ♦ గనలుచుండు
మామయెంత విషస్వ ♦ భావుఁడో జననాశ
తరుణమన్నను బొంగి ♦ పొరలుచుండు

తే॥ గీ॥ విదురపట్టదు నీకెప్డు ♦ నిఖలలోక
ప్రళయమనుమాట వినునంత ♦ వణకెదెంత

పాపమోకాని యెంత ని ♦ ర్భాగ్యుఁడైన
నమ్మికొల్చునె నీయడుఁగు ♦ దమ్ము లహహా
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 37

సీ॥ గొంతులో విషముంచి ♦ కొని మాటలాడు క
పాలియా మీ ప్రియ ♦ బాంధవుండు
గురుపత్నిఁగూడి తాఁ ♦ గొంటెయై దిరుగాడు
క్షయరోగియా మీకు ♦ స్యాలకుండు
తనకంటెఁబెద్దయా ♦ తరుణికి మగఁడైన
యంగవిహీనుఁడా ♦ యాత్మజుండు
నీవుండ నితరుల ♦ నత్తిపైఁ దనభార
ముంచిన ప్రౌఢయా ♦ ముఱియుచుండు
తే॥ గీ॥ భార్య; తెలిసెను నీవారి ♦ వలన యుష్మ
దీయ సద్గుణసంపత్తి ♦ వేయునేల
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ ♦ విశాలభావ. 38

సీ॥ త్రోసివేయక మాటఁ ♦ దోయధి దయఁబూని
భువినొసంగినఁ గట్టి ♦ తివి పురంబు
నడిగినంతన కుబే ♦ రుఁడు ఋణంబిచ్చినఁ
బెండ్లాడితివి మహా ♦ పెద్దనుచుఁ
గలుములజవరాలు ♦ కాంతయైన కతాన
వాసిగంటివి ధన ♦ వంతులందు

నైనవారలు పెద్ద ♦ వని గౌరవముఁజూప
వల్లవజనచక్ర ♦ వర్తివైతి
తే॥ గీ॥ వేదిపదిమందితోఁపాటు ♦ వాదమునకు
నైనఁ బిత్రార్జితంబు నీ ♦ కనఘచరిత
సురుచిరవిలాస లకునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 3

సీ॥ సవతితల్లికి సంత ♦ సముఁగూర్ప వనికేగి
తల్లిపై శోకాగ్నిఁ ♦ జల్లినావు
సర్వసద్వంశజా ♦ చక్రమేలు మటంచు
సహజుండు వేడ వే ♦ సారినావు
అతిబలుండగు వాలి ♦ నన్యాయమునఁద్రుంచి
బలహీను రవిజుఁ జే ♦ పట్టినావు
నినుగాంచి సంతోష ♦ నీరధినోలాడు
నవనిజం బరుషోక్తు ♦ లాడినావు
తే॥ గీ॥ ఏమిటికివెట్టి నడవడి ♦ స్వామివైన
నాదు పీవేమి యాలోచ ♦ నవరుఁడవొకో
సురుచిరవిలాస లకునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 4

సీ॥ స్వల్పదానముఁగోరి ♦ సర్వస్వ మపహరిం
పఁగనెంచు టెంత సం ♦ పత్కరంబొ
వంచించి రాజన్య ♦ సంచయమును భైష్మిఁ
దోడితెచ్చు టదెంత ♦ దొడ్డతనమొ

బీదబాపనిగోరి ♦ పృథుకముల్పెట్టించి
కొని తినుటెంతటి ♦ గొప్పగుణమొ
ప్రణయవైరావేశ ♦ భరితమై యొప్పారు
పడఁతికి మ్రొక్కుటలే ♦ పాటిఘనమొ

తే॥ గీ॥ తెలియ నేరికి తరము నీ ♦ దివ్యచిత్త
గతివిలాసము బ్రహ్మాండ ♦ తతులలోన
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 41

సీ॥ స్త్రీవచనంబుచే ♦ స్థిరతరంబౌ తాత
సకలసంపత్తికి ♦ స్వస్తి చెపితి
వొకపక్షిమాట తా ♦ వక మనంబున నమ్మి
నిర్ణయించితి శత్రు ♦ నిలయ మహాహా
ఒకకోతితో స్నేహ ♦ మొనరించి స్వమతాను
యాయిపై నాగ్రహ ♦ మందినావు
బుధశత్రుఁడగువాని ♦ బుద్ధుల నాలించి
జడమయునకు మ్రొక్కఁ ♦ జాలితీవు

తే॥ గీ॥ నీగుణంబులు వినుతింప ♦ నెవరితరము
సకలముడిగిన సన్నాసు ♦ లకును దప్ప
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 42

సీ॥ పుత్రిని దయ్యాల ♦ పోతున కిచ్చితిఁ
గాపురంబేరీతిఁ ♦ గడపఁగలదొ

అనయము వైరుధ్య ♦ మునఁ బెనంగెడు భార్య
లిరువుర నిఁక నెట్టు ♦ లేలఁగలనొ
ఆత్మజుం డంగనా ♦ దౌత్య జీవనుఁడయ్యె
నీ యపకీర్తి నే ♦ నెట్లు సైతు
శ్వశురుఁడే కాలంబు ♦ జడనిధియైయుండెఁ
గష్టసౌఖ్యము లేరి ♦ కడను దెల్పు

తే॥ గీ॥ దనుచు వైరాగ్యమును బొంది ♦ మనమునందుఁ
బాముపైఁ బవ్వళించితే ♦ స్వామి నీవు
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్న కేశవదేవ వి ♦ శాలభావ. 4

సీ॥ స్వాంతమందున దేవ ♦ తాంతరంబును వీడి
భజియింప మిము బహు ♦ భక్తిఁబొంగి
యొకనాటికైన న ♦ న్మొక పరీక్షించుటల్
మానకుంటివటంచు ♦ మదిగలంగి
తలఁచినంతనె యిష్ట ♦ తమములౌ వస్తువుల్
దండ్రియీయకయున్నఁ ♦ దనయుభంగి
నభిలషించినవేళ ♦ నరసి కామ్యార్థముల్
భర్తయొసఁగకున్న ♦ భార్యభంగి

తే॥ గీ॥ వంబుజాతాక్ష నే స్వతం ♦ త్రంబువలన
నంటి నినుఁ గొన్నిమాట ల ♦ న్నింటి మదిని
నిల్పి గనలకు నా మనో ♦ నిశ్చయంబు
సర్వమెఱుఁగవె దేవతా ♦ సార్వభౌమ

సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 44

సీ॥ జనకుఁడట్టైశ్వర్య ♦ సంపన్నుఁడై యున్న
సుతుఁబొందఁగారాని ♦ శుభమదేడి
పతివయోభాగ్యరూ ♦ పములుండి వశుఁడైన
సతిఁబొందఁగాలేని ♦ సౌఖ్యమేది
సార్వభౌముఁడు వేద ♦ శాస్త్రానుచరుఁడైన
ప్రజవడయఁగలేని ♦ భాగ్యమేది
అఖిలకళావిదుం ♦ డాచార్యుఁడై యున్న
గృహమేధిఁగూడని ♦ మహిమయేది
తే॥ గీ॥ సర్వశేషివి నీవు మా ♦ స్వామివైతి
వెందు మే మొందరాని యా ♦ నందమేది
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 45

సీ॥ అణువునం బరమాణు ♦ వౌచు మహత్తునం
దతి గొప్పవై వెల్గు ♦ నతఁడెవండు
అఖిలాండకోటి బ్ర ♦ హ్మాండ సృష్టిస్థితి
ప్రళయకర్తుండగు ♦ ప్రభువెవండు
ప్రథితవేదాత్మక ♦ ప్రణవకారణవర్ణ
వాచ్యుఁడై చెలువొందు ♦ వాఁడెవండు
భవపద్మసంభవ ♦ ప్రముఖులౌ యమరులఁ
గనుసన్నలను నిల్పు ♦ ఘనుఁడెవండు

తే॥ గీ॥ ఆదిమధ్యాంతరహితుఁడా ♦ యతఁ డెవండు
నీవుగాకన్యుఁ డొకఁడుండు ♦ నిరుపమాన
సురుచిరవిలాస లకునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 46

సీ। స్వర్ణది నీపాద ♦ సరసిజోద్భవమయ్యెఁ
బల్కఁగలారె శ్రీ ♦ పాద మహిమ
పరమేష్ఠి నీ నాభి ♦ పద్మమం దుదయించె
నుదరసంపద నెన్నఁ ♦ గ దరమౌనె
చంద్రుండు నీ మనో ♦ జాతుఁడై వెలుగొందె
నాత్మవైశద్య మే ♦ మని వచింత్రు
లోకబాంధవుఁడు నీ ♦ లోచనభవుఁడయ్యెఁ
దరమె వీక్షణభాగ్య ♦ గరిమఁ బొగడఁ

తే॥ గీ॥ గవులు గుమిగూడి వేయేండ్లు ♦ కష్టపడిన
నీకు సముఁడవు నీవెపో ♦ నిశ్చయముగ
సురుచిరవిలాస లకునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 47

సీ॥ ఆత్మేశ్వరుండవై ♦ యలరెదు నీకంటెఁ
బరుఁడెవ్వఁడీ లోక ♦ ప్రతతికెల్ల
విశ్వాత్మకుండవై ♦ వెలసిన నిను వీడి
యెవనిలో లయమగు ♦ భువనపంక్తి
భవదీక్షణాత్తవై ♦ భవులయ్యె బ్రహ్మాదు
లభవయుష్మత్సమా ♦ భ్యధికు లెవరు

నీకంటె నెవ్వఁడీ ♦ నిగమ మహారణ్య
సంచారలభ్యుఁడౌ ♦ శాశ్వతుండు
తే॥ గీ॥ సకలచేతన రక్షణో ♦ త్సాహపరవ
శుండవీ వొక్కరుఁడవె వే ♦ తండవరద
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 48

సీ॥ పరమయోగులకైనఁ ♦ బట్టంగరాని ని
న్నతివ యొక్కతె ఱోటి ♦ కంటఁగట్టె
సిరియైన నీయానుఁ ♦ జెందని వాల్లభ్య
పదవినొందిరి గొల్ల ♦ పడుచు లహహ
బ్రహ్మనులకునైనఁ ♦ బడయంగరాని నీ
పరిచర్యనందె గో ♦ పాల సుతులు
మహనీయ దుర్లభ్య ♦ మగు భవద్దర్శన
మా భీరకరతలా ♦ మలకమయ్యె
తే॥ గీ॥ వారి సౌభాగ్యమో లేక ♦ వనజభవుని
వ్రాతనైనను దిద్దు శ్రీ ♦ వారి దయయొ
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 49

సీ॥ ఆహారనిద్రల ♦ నైన విసర్జించి
లెక్కింపవచ్చు భూ ♦ రేణువులను
బహువిధశ్రమలకో ♦ ర్చి ♦ పల్కవచ్చును మింటి
చుక్కల నెన్నియో ♦ లెక్కవెట్టి

సాగరోదకబిందు ♦ సంతతిఁ గట్టించి
లెక్క సేయఁగవచ్చు ♦ నిక్కముగను
దేవాధిదేవ నీ ♦ దివ్యమంగళగుణా
వళి మామకీన దు ♦ ర్వారకలుష
తే॥ గీ॥ ములను గణియించి తెల్పఁగా ♦ నలవియగునె
ధాతకైనను బ్రమథ సం ♦ త్రాతకైన
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 50

సీ॥ నిష్కాములై మిమ్ము ♦ నిరతము సేవించు
పరమభక్తులకెల్లఁ ♦ బాడికుండ
సర్వస్వమును భవ ♦ త్సాన్నిధ్యమే యను
ఘనులకెల్లరకు బం ♦ గారుకొండ
ముక్తికాంతా మన ♦ శ్శక్తి సంహారశీల
మగు భవజ్జనుల ము ♦ త్యాలదండ
శమన సైనిక ధైర్య ♦ శౌర్యంబులను మాపి
పాఱఁదోలఁగజాలు ♦ పట్టుజండ
తే॥ గీ॥ శత్రుజనమారణోత్క్షిప్త ♦ చాపదండ
మార యేమందు దేవర ♦ వారి యండ
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 51

సీ॥ ద్రోణిబాణాగ్ని సం ♦ తప్తుఁడై పసిపాప
ప్రాణముల్ బేసి చేఁ ♦ బడసెఁ దొల్లి

ఎందుచే ధర్మజుం ♦ డేడు దీవుల నేలెఁ
దన యశశ్చంద్రిక ♦ ల్ధరణిఁజల్లి
ధ్రువుఁడెటులొందె వా ♦ గ్ధవ ముఖ్య గీర్వాణ
సమితి చేరనిచోటు ♦ సంతసిల్లి
సకలబ్రహ్మాండ సం ♦ క్షుభిత పాపౌఘము
న్ప్రథఁగాంచె నెందుచేఁ ♦ బాలవల్లి

తే॥ గీ॥ అట్టి భవదీయ సరసద ♦ యామతల్లి
కాదె దాసులపాలిటి ♦ కల్పవల్లి
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 52

సీ॥ మన్నుఁదింటి వటంచు ♦ మున్ను నిన్ను యశోద
దండించె నా సతి ♦ ధైర్యమెంతొ
నందుండు నిన్నాల ♦ మందలఁగాయఁగా
నియమించె నాతని ♦ నేర్పదెంతొ
వెన్నముచ్చని గొల్ల ♦ కన్నియల్నినుబట్టి
బంధించిరట వారి ♦ బలమదెంతొ
గురుపత్ని కట్టెలు ♦ గొట్టి తెమ్మని పంపెఁ
దలపోయ నామె స్వా ♦ తంత్ర్యమెంతొ

తే॥ గీ॥ భక్త్యధీనుండవగుటచే ♦ శక్తికల్గి
చేసిరానాడు వారిట్టి ♦ చేష్టలహహ
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 53

సీ॥ రాజ్యార్థులై మిమ్ముఁ ♦ బ్రార్థించువారికిఁ
గరిపురీశుఁడు యుధి ♦ ష్ఠిరుఁడె సాక్షి
పుత్రార్థులై మిమ్ముఁ ♦ బూజించువారికిఁ
దరుణీలలామ యు ♦ త్తరయె సాక్షి
సౌఖ్యార్థులై మిమ్ము ♦ శరణనువారికి
ఘనుఁడైన యా విభీ ♦ షణుఁడె సాక్షి
మోక్షార్థులై మిమ్ము ♦ పేక్షించువారికి
ఖట్వాంగభూమి పా ♦ గ్రణియె సాక్షి

తే॥ గీ॥ సిరులు నిను గోరి యనిశము ♦ సేవఁజేయు
చుండువారికి ధరఁ గుచే ♦ లుండె సాక్షి
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 54

సీ॥ భవదీయ దివ్యనా ♦ మప్రభావోత్కర్ష
దాక్షాయణీ ప్రాణ ♦ ధవుఁ డెఱుంగు
త్వత్పాద సరసిజా ♦ త పరాగమాహాత్మ్య
మతిపూత గౌతమ ♦ సతి యెఱుంగు
తమ నిగ్రహా ప్రసా ♦ దముల వైఖరి భక్తి
పరుఁడైన యాపగా ♦ వరుఁ డెఱుంగు
మీ సత్యశేముషీ ♦ భాసురలీల లా
దశకంధరుని సహో ♦ దరుఁ డెఱుంగుఁ

తే॥ గీ॥ గాక దేవర కల్యాణ ♦ ఘనగుణౌఘ
మహిమఁ దెలియంగ నేర్చునే ♦ మాదృశుండు

సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ ♦ విశాలభావ. 55

సీ॥ ఇఁక ప్రాణముల్నిల్వ ♦ వాక తృణంబనుదాఁక
వారణేంద్రుని గావ ♦ వచ్చినావె
రారాజు సభలోఁ బ ♦ రాభవించినదాఁక
ద్రౌపదిఁ బ్రోవఁగాఁ ♦ దలఁచినావె
అన్న చేఁ దన్నులు ♦ తిన్నదాఁక విభీష
ణునిపై దయారస ♦ మూనిచినావె
పినతల్లి వెళ్ళఁగొ ♦ ట్టినదాఁక యూత్తాన
పాదిని గరుణఁ గా ♦ పాడినావె

తే॥ గీ॥ భక్తజనులకు ముందదాం ♦ భావ ముడిపి
కడకు రక్షించుచుందు వో ♦ కమలనాథ
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 56

సీ॥ ధృతశిరస్తటవిష ♦ ప్రతతుఁడై చెల్వొందు
పురుషుఁడా మీ భార ♦ మూనువాఁడు
సతతరంధ్రాన్వేష ♦ రతుఁడై ప్రవర్తిల్లు
పురుషుఁడా మీ భార ♦ మూనువాఁడు
వినువేళఁ గనలేని ♦ గనువేళ వినలేని
పురుషుఁడా మీ భార ♦ మూనువాఁడు
వక్రగాములకెల్ల ♦ వల్లభుఁడైయున్న
పురుషుఁడా మీ భార ♦ మూనువాఁడు

అఖిలజగత్ప్రాణ ♦ హారియై జీవించు
పురుషుఁడా యీ భార ♦ మూనువాఁడు
తే॥ గీ॥ ఆదినుండియు శేషుఁడే ♦ యను తలంపు
చేత నిక్షేపరాయఁడా ♦ యీతగాని
యందు నీ సర్వభారంబుఁ ♦ బొందుపఱచి
సాక్షివై చూచుచుంటివే ♦ జాయతోడ
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 57

సీ॥ ఆస్యవివరమునం ♦ దఖిల ప్రపంచంబుఁ
జూపింపఁగ యశోద ♦ చోద్యమందె
కార్చిచ్చు మ్రింగుట ♦ గ్గనులారఁగాంచి గో
పరిపాలకుల్మహా ♦ ప్రౌఢుఁడనిరి
కాళియోరగు ఫణా ♦ గ్రములఁ దాండవకేళి
సల్పుచో లోకుల ♦ సాధ్యుఁడనిరి
తననపాంపతిలోక ♦ ముననుండి కొనిరాగ
నందుండు నిరుపమా ♦ నందుఁడయ్యెఁ
తే॥ గీ॥ గాని నిను సర్వకారణ ♦ కారణుండ
వనుచు మదినమ్మి గొల్చిన ♦ వారలేరి
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ ♦ విశాలభావ. 58

సీ॥ రారశౌరి యటంచుఁ ♦ జీరి నిన్ముద్దాడె
నందునిభాగ్య మే ♦ మందునొకొ

త్వచ్ఛరీర రజోంకి ♦ తముఁ జేసికొన మేను
　　　　నందునిభాగ్య మే ♦ మందునోకొ
వచ్చిరానట్టి నీ ♦ వాక్యంబు లాలించె
　　　　నందునిభాగ్య మే ♦ మందునోకొ
భవదుపగూహాన ♦ పారవశ్యమునొందె
　　　　నందునిభాగ్య మే ♦ మందునోకొ

తే॥ గీ॥ ఎన్నిజన్మలఁ జేసిన ♦ పున్న మతనిఁ
జేర నినుఁ బెంచఁగల్గెనో ♦ చెప్పనగునె
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 59

సీ॥ స్తనములంగాళోల ♦ మునుబూని పాల్ద్రావఁ
　　　　జేసిన కుమతి కి ♦ చ్చితివె మోక్ష
మభవయుష్మచ్ఛత్రుఁ ♦ డౌ శిశుపాలు నై
　　　　క్యముఁ జేసికొంటివి ♦ వాత్మయందు
మీపేరు వినవని ♦ మేదినిఁ దిరుగు ఘం
　　　　టాకర్ణు పాప మ ♦ డంచి తహహా
నీ ప్రాణముల్దీయ ♦ నెంచి రప్పించిన
　　　　శుంఠ కిచ్చితివి వై ♦ కుంఠపదవి

తే॥ గీ॥ శాత్రవులకైన నీ విట్టి ♦ సౌఖ్య మొసఁగ
మఱుఁగుఁ జేరినవారి కే ♦ మఱుగు భువిని
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 60

సీ॥ లోకంబు లుదరంబు ♦ లోనఁ గల్గిన నీకు
వసుదేవు గృహమె ని ♦ వాసభూమి
యఖిలకారణుఁడవై ♦ నెగడు నీ కా యశో
దా నందులే తల్లి ♦ దండ్రు లహహా
పాలకడలిలోనఁ ♦ దేలియాడెడు నీకు
బలకరంబే గొల్ల ♦ పడఁతి పాలు
చరణంబునన్గంగ ♦ జననమొందిన నీకు
శుచియొసంగెనె గర్గ ♦ సుఘట జలము

తే॥ గీ॥ ఏమిచిత్రము నీ కథ ♦ లెవని కెఱుక
భక్తమందార ధృతలోక ♦ భారధీర
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 61

సీ॥ పురిటింటిలోఁ దల్లి ♦ పుత్రులంబోలె స
ద్భక్తాళి నరసి కా ♦ పాడుచుంట
అఖిలకష్టములు నీ ♦ వనుభవించుచునైన
దాసుల కభిలషి ♦ తంబు లిడుట
జనకుండు సుతు నవ ♦ చారంబు కైవడిఁ
బరమభక్తుల దోష ♦ మరయకుంట
లేగను వెన్నంటి ♦ యేగు ధేనువుమాడ్కి
సేవకతతివెంటఁ ♦ బోవుచుంట

తే॥ గీ॥ తగిదె దేవరవారికే ♦ తమనుబోలు
పోషకుండేడి పదునాల్గు ♦ భువనములను

సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 62

సీ॥ కృష్ణత్వమునమించెఁ ♦ గిసలయాధరి భవ
త్కచ సుందరంబు నే ♦ కవి వచించు
నచ్యుతత్వమునొందె ♦ నంగన నీ పయో
ధరము లౌన్నత్య మెం ♦ తనుచుఁ జెప్పు
భుజగపర్యంకత్వ ♦ మును బొందె నతివ నీ
యుదర మెట్లు నుతించు ♦ మదనుఁ డైన
నీ శరీరము హృషీ ♦ కేశత్వము వహించె
సుందరి నీ యంద ♦ మెందుఁ గల్గు
తే॥ గీ॥ ననుచుఁ గులటలఁ బొగడుచు ♦ ననుదినంబు
జారుఁడైనను మోక్షంబుఁ ♦ జూఱఁగొనఁడె
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 63

సీ॥ చరియింతు విూ దివ్య ♦ చరణయుగ్మము నమ్మి
నినుగాంచి యభ్రమే ♦ యనును నమ్మి
సలిపించితివి కౌర ♦ వులపైన నొక దొమ్మి
పాండుపుత్రులతోటి ♦ పాటుకమ్మి
గర్వంబువిడదె నీ ♦ కన్నవఁగనిదమ్మి
దాపుఁజేర్పఁగ రాదె ♦ దయనుజిమ్మి
నినుఁగాక నితరుల ♦ నే స్తుతింపను సుమ్మి
విన్నపమాలింప ♦ వేగరమ్మి

తే॥ గీ॥ భక్తిధనమును వాంఛించి ♦ భావమిమ్మ
వసుధఁ దిరుగుట నీ కల ♦ వాటె లెమ్మ
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 64

సీ॥ సకలవారిచరాళి ♦ చరియింప ధృతిఁదూలి
మున్నీటిలోఁదేలి ♦ ముగ్గఁజాలి
భుజగలోకంబెల్ల ♦ భుగభుగధ్వనివల్లఁ
దల్లక్రిందై తల్ల ♦ డిల్లి డుల్ల
దుమికినంతన పొంగి ♦ తోయరాశి చెలంగి
నలువైపులఁ గలంగి ♦ కలయనింగి
సోమకాసురుఁ దొట్టి ♦ సుఖలీల మెడఁబట్టి
ప్రాణముల్వోడఁగొట్టి ♦ వడసినట్టి
తే॥ గీ॥ త్రయిఁ బ్రసాదింపవే మున్ను ♦ ధాతృ నార్తి
మాపి లోకైకకీర్తి శ్రీ ♦ మత్స్యమూర్తి
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 65

సీ॥ పాలమున్నీరొక్క ♦ భాండమై వెలుగొంద
మహితాద్రియూపమై ♦ మార్పునొంద
ఫణిపతిరజ్జువై ♦ పరిణామమును జెంద
లోకముల్పుకునాల్గు ♦ లోనఁ గుంద
తమతమ హాస్తము ♦ ల్దారుమారై కందఁ
ద్రచ్చుచుండఁగ దేవ ♦ దనుజులంద

రును గూడి నగము జా ♦ రుచునుండ నంగంద
నిలిచి సంప్రార్థింప ♦ నీవు క్రిందఁ
తే॥ గీ॥ జేరి మూపునఁబూని య ♦ శేషభార
మమృత మొసఁగితి వార కూ ♦ ర్మావతార
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 66

సీ॥ గిరిమహీరుహాయుక్త ♦ ధరణినాకముఁగీతి
ముంచి సాగరమందు ♦ మించి నీతి
వీడి మిమ్మెదిరింప ♦ విబుధలోకారాతి
యైన హిరణ్యాక్షు ♦ నాత్మహేతిఁ
బడఁద్రుంచి దైత్యులు ♦ పార దిక్కులు భీతి
మాయురేయన దేవ ♦ మనుజజాతి
సస్యాగ్రలగ్నతు ♦ షారబిందువుభాతి
వెలుఁగ దంష్ట్రాగ్రమం ♦ దిలమహాతి
తే॥ గీ॥ వైభవంబునఁ గన్పట్టి ♦ వసుధ లాఁతి
వారలందెల్ల భీతిభా ♦ వంబుఁబాతి
తహహా శ్రీమద్వరాహరు ♦ ద్రాబ్జసూతి
తుష్టికారణమైతివ ♦ రిష్టతాతి
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 67

సీ॥ పుండరీకాక్షుఁడీ ♦ మండప స్తంభమం
దుండకుండిన నిన్నుఁ ♦ జెండి ఖండ

ఖండము ల్సేతు నా ♦ మండలాగ్రంబుతో
నుండు మర్భకయంచు ♦ మండి చండ
తాండవంబునఁ బద్మ ♦ జాండభాండమునిండ
గండఁడైయార్చి యు ♦ ద్దండదండ
శౌండుఁడై వసుకశి ♦ పుం డాత్మదోఃకాండ
మండితంబగు గదా ♦ దండతుండ

తే గీ॥ మున హిరణ్యసభా స్తంభ ♦ మును వితండ
వాదియై మోదెఁ దెలియ కీ ♦ వంచునుండ
సురుచిరవిలాస లకునాఖ్య ♦ పురనివాస
చన్న కేశవదేవ వి ♦ శాలభావ. 68

సీ॥ ప్రళయనిర్ఘాతతా ♦ వము నీసడింపఁజా
ల్పెళపెళధ్వని లోక ♦ ములఁ గలంప
లయకాలజనిత వ ♦ లాహకతతిలీలఁ
బాగ్రమ్మ భూనభం ♦ బులు చలింప
మిన్నంది భువిప్రాలు ♦ మిణుగురులనుగాంచి
యసురుఁడు మృతి తప్ప ♦ దని తలంప
వనజాసనాది దై ♦ వతనికాయము భీతి
కలితమౌ భక్తి నం ♦ జలి ఘటింప
నరసింహరూపివై ♦ ధర హేమకశిపుని
యసువులాత్షణములో ♦ నపహరింపఁ
దరలికంబమునుండి ♦ దైత్యుని బరిమార్చి
తౌరార ప్రహ్లాదుఁ ♦ డభినుతింప

తే॥ గీ॥ భక్తరక్షణపరత ని ♦ న్బరిధవింప
సకలమునిపుంగవుల్గాడి ♦ సంతసింప
వితతకీర్తి వహింప నే ♦ వితనిలింప
సురుచిరవిలాస లసునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 69

సీ॥ అదితికశ్యపులకు ♦ నన్గుబిడ్డఁడవౌచుఁ
బుట్టి వారల పున్న ♦ మునను బట్టి
వటుగువై పసుపుదో ♦ వతి కటీతటమునం
గట్టి యాచ్ఛాసీచ ♦ కంబునెట్టి
బలిసలలిత యజ్ఞ ♦ నిలయము సుఖలీల
మెట్టి తచ్చిత్తంబుఁ ♦ గట్టిపెట్టి
త్రిపదవైశాల్య ప్ర ♦ థ్వని గోరి దానముం
బట్టి మోదముతో న ♦ భంబుఁదాఁట్టి
తే॥ గీ॥ అంఘ్రియుగమున దివి భువి ♦ నణచిపట్టి
వసుధనిల్పక యతని యా ♦ వలకుఁగొట్టి
త్రిదశసామ్రాజ్య మన్నపైఁ ♦ దెచ్చికట్టి
తెంత చేసితో పొట్టివై ♦ యంతుముట్టి
పరుఁడెవండైనఁ గలఁడె నీ ♦ వంటి జెట్టి
సురుచిరవిలాస లసునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 70

సీ॥ జగతి రాజన్యవం ♦ శజులు దుర్మదులౌచుఁ
దిరుగ భూభారంబుఁ ♦ దీర్ప నేమ

మును బూని పరమపా ♦ వనమైన భృగుమహా
మునివంశమున నీవు ♦ మొనసి జామ
దగ్న్యుండవై పుట్టి ♦ ధరణి ముయ్యేడుమా
ర్లఖిలాయుధములతో ♦ నమిత తామ
సమునొంది రాజవం ♦ శజులను వెంటాడి
నటికి ప్రోవులువెట్టి ♦ నైజధామ

తే గీ॥ మునకుఁజేరితి వరిభీమ ♦ మునిలలామ
పతితజనపావనోద్దామ ♦ పరశురామ
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 71

సీ॥ సకలజగజ్జాల ♦ జనకుండవై కోస
లేంద్రుని సుతుఁడవౌ ♦ టెంతవింత
ప్రమథాధిపతి ధను ♦ ర్భంగశుల్క మొసంగి
యింతిని గైకొను ♦ టెంతవంత
మటవులలోనఁ బ ♦ ర్యటనంబుసేయుట
త్రిదశశాత్రవుల క ♦ దెంత చింత
బలపరాక్రమశాలి ♦ బలభేది తనయున
కినతనూజుని మైత్రి ♦ యెంత వంత
పగవానితమ్ముని ♦ పై ననుగ్రహమూని
చెంతఁజేరఁగదీయు ♦ టెంత శాంత
మఖిలసేనలతో ద ♦ శాస్యుని బరిమార్చు
టింద్రాది దివిజుల ♦ కెంత సంత

తే॥ గీ॥ సమము మెఱుంగ వశంబె యీ ♦ జగతి నెంత
వారలకునైన రఘుకులే ♦ శ్వర రవంత
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 72

సీ॥ యాదవకుల కల ♦ శోదధి పూర్ణసు
ధాకరమూర్తివై ♦ దనరి లీల
హలగదాముసల ఖ ♦ డ్గాది దివ్యాయుధం
బులఁబూని హస్తినా ♦ పురముఁ గేలఁ
బెకలించి భూభా ♦ రకులను దునుమాడి
రైవతరాజాధి ♦ రాజ బాలఁ
బరిణయంబై యహ ♦ ర్పతి తనూజాతపై
నగ్గి తద్దుర్ణయం ♦ బపుడె నేల
తే॥ గీ॥ పాలుజేసితి మధులోల ♦ నీలచేల
కదనరిపుజాలకాల శ్రీ ♦ కాంత పాల
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 73

సీ॥ దేవకియను వసు ♦ దేవుని పత్నియం
దావిర్భవించి మా ♦ యావిలోల
మానసులా యశో ♦ దా నందులను జేరి
వారిచేఁ బెంపుడు ♦ వడసి రాల
వానను గురియింప ♦ వాసవుఁ డపు డద్రి
శేఖరి మెత్తి నీ ♦ చిఱుత వ్రేలఁ

గంసాది దుష్టరా ♦ క్షసులను హరియించి
మొనసి భీష్మకసుత ♦ నోమహాజాల
తే॥ గీ॥ బద్ధచిత్తనుజేసితో ♦ భర్మచేల
పరమకరుణాలవాల గో ♦ పాలబాల
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 74

సీ॥ భువనవిధ్వంసన ♦ ప్రవరులౌ రాక్షసా
ధముల నుక్కడఁగింపఁ ♦ దరుణమెంచి
తావకమహిమచేఁ ♦ దద్వధూజనమున
కసతీత్వ దుర్యశం ♦ బపుడె పంచి
నిత్యానుభవసిద్ధ ♦ నిర్జరౌఘ సమస్త
బాధలం దలఁచి కో ♦ పంబుఁ బెంచి
దానవహానుభంగిఁ ♦ దద్దైత్యవనము ని
మేషమాత్రమున భ ♦ స్మీకరించి
తే॥ గీ॥ అఖిలలోకంబులను గావ ♦ నవతరించి
తౌర బుద్ధస్వరూప మీా ♦ వధిగమించి
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 75

సీ॥ సకలసంపజ్జాత ♦ జనకమౌ భవదీయ
చరణ నీరజభక్తి ♦ మఱపుఁజెంది
నిగమచోదిత ధర్మ ♦ నిర్ణయంబును వీడి
మధుచౌర్య వనితాభి ♦ మానమొంది

తిరుగాడ భూజను ♦ ల్గలియుగాంతమున నీ
వతులిత ఘోర కో ♦ పాగ్నిఁబొంది
అత్యున్నతంబైన ♦ హయము నధిష్ఠించి
ప్రోదినీసమచంద్ర ♦ హాసమంది

తే॥ గీ॥ కలికివై రాగనుంటివి ♦ యిలఁ గడింది
గుమినిజకాృఁడ బాహుబ ♦ లము గొలంది
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్న కేశవదేవ ♦ విశాలభావ. 76

సీ॥ శేషాద్రిశిఖర సం ♦ స్థితుఁడవౌ నీవు మా
యిలువేల్పువైయుండ ♦ నేమిభయము
శ్రీరంగపతివౌచుఁ ♦ జెల్వొందు నీవు మా
సేమమరయుచుండ ♦ నేమికొఱఁత
నిగమాద్రిపై నీవు ♦ నెలకొని మా గృహ
వైద్యుండవైతివే ♦ వాంఛగలదు
శాలిహోత్రాశ్రమా ♦ స్థాన నాథుండవై
గాచుచుంటివి మాకుఁ ♦ గలదె చింత

తే॥ గీ॥ భద్రగిరి తుంగశృంగాగ్ర ♦ భాగమందు
వెలసియుండియు నిను మదిఁ ♦ దలఁచునంత
నాపదుద్ధారకుండవై ♦ యలరుచుందు
విహపరంబుల మాకిఁక ♦ నేమివలయు
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్న కేశవదేవ వి ♦ శాల భావ. 77

సీ॥ నందునకు సుతుఁడని ♦ నవనవోన్మేషమా
ప్రేమచే నిను బెంచి ♦ పెద్దఁజేసి
హితుఁడని గోపకు ♦ లనతతము నినుఁగూడి
బృందావనస్థలిం ♦ జెందియాడి
కందర్పశతకోటి ♦ సుందరుండని గొల్ల
పడుచులు నీపయి ♦ న్భ్రాంతిఁజెంది
ప్రియసహోదరుఁడని ♦ ప్రేమచేఁ బాంచాలి
నినుగాంచి సంతసం ♦ బున మెలంగి

తే॥ గీ॥ ధన్యతము లైరిగాదె నీ ♦ తత్వ మరయ
కున్న వారల కెం దేమి ♦ కొఱఁతగల్గె
సురుచిరవిలాస లకునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 78

సీ॥ శశధరాన్వయమందు ♦ జన్మించి యాభీర
పతి సతీమృద్వంక ♦ పాళినెక్కి
గొల్లముద్దియలిండ్ల ♦ నల్లరిఁ గావించి
దొంగవై పాలు పె ♦ రుగు మెక్కి
కటితటంబునదట్టి ♦ గట్టిగా బిగియించి
కాళియోరగుతల ♦ ల్గదలఁద్రొక్కి
మొనసి గోపాల గో ♦ ధనములన్సృష్టించి
పరమేష్ఠి గర్వభా ♦ వంబుఁ జెక్కి

తే॥ గీ॥ సకలయోగీంద్ర హృత్పంక ♦ జములఁజొక్కి
మహిమవెదచల్లి యిటనుంటి ♦ మాకుదక్కి

సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 79

సీ॥ అవనిజాప్రముదావ ♦ హంబు నీ వాల్యాపు
దాసుల కిష్టార్థ ♦ దంబు ప్రాపు
ఖరదూషణాది రా ♦ క్షసమారకము తూపు
మొనసి మందరగిరి ♦ మోసె మూపు
అక్రూరునకుఁ జూపి ♦ తేర నీ తొలిరూపు
భవదంఘ్రి సంసార ♦ భయముఁ బాపు
త్వత్తేజ మంబుజో ♦ ద్భవ ముఖ్యులకుఁ గాపు
చిరభక్తి యముని కిం ♦ కరుల నాపు
తే॥ గీ॥ నీ మహాశక్తి జగముల ♦ నేలనోపు
చూపు నీమూర్తిఁ గనులకు ♦ రేపుమాపు
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 80

సీ॥ అణిమాదిదాయకుం ♦ డగు పార్వతీ మనో
రమణుఁడు మీ మిత్ర ♦ రత్నమైన
సకలసంపద్దేవ ♦ తాఖ్యచేఁ జెలువొందు
భార్గవి మీ ప్రియ ♦ పత్నియైనఁ
త్రిభువనసామ్రాజ్య ♦ విభవాధికారియౌ
పాకశాసనుఁడు మీ ♦ భ్రాతయైన
నవనిధిపరిపాల ♦ నాధ్యక్షుఁడౌ యక్ష
పతి భవత్కైంకర్య ♦ గతికుఁడైన

తే॥ గీ॥ బలిని యాచింప మీ కేగ ♦ వలసె నెవరి
నాదుకొందురు లేమియం ♦ దైనవారు
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 81

సీ॥ ప్రహ్లాదు నటు బహు ♦ భంగుల బాధించి
భర్మకశిపుఁ డేమి ♦ బాగుపడియెఁ
బాండవులకు భంగ ♦ పాటుఁగూర్చిన ధార్త
రాష్ట్రాగ్రజుం డెంత ♦ రాజ్యమేలె
వినయుఁడైన విభీష ♦ ణుని దిరస్కృతుఁ జేసి
పౌలస్త్యుఁ డెన్నాళ్ళు ♦ బ్రతుకఁ గల్గెఁ
గోపంబుచే ముచు ♦ కుందుని తలఁదన్ని
కాలయవనుఁ డెన్ని ♦ గడియలుండె
తే॥ గీ॥ వసుధ రోజులుదీరిన ♦ వారలెల్ల
రిట్లె భవదీయులఁ దృణీక ♦ రించుచుంద్రు
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 82

సీ॥ సరసశబ్దార్థ ల ♦ క్షణ మెఱుంగకఁ గృతిఁ
గూర్చుట మీపేర ♦ గొప్ప తప్పు
త్రికరణశుద్ధిగా ♦ నొకపరియైన మీ
సేవఁ జేయక మనుట ♦ చెడ్డ ముప్పు
పెట్టుపోతలు లేక ♦ కట్టుకుంకల కొల్వ
చన్న జన్మలఁ జేసి ♦ కొన్న యప్పు

కవిజనధికార • కరణంబు తన యశ
స్సుందరీమణి తల • క్రింద నిప్పు

తే॥ గీ॥ అభవ నీ భక్తితాపత్ర • యంబు విప్పు
చెనటి సఖ్యంబు సుజ్ఞాన • ధనముఁ గప్పు
సురుచిరవిలాస లశునాఖ్య • పురనివాస
చన్నకేశవదేవ వి • శాలభావ. 83

సీ॥ సతత గోదాన దీ • క్షాపరుండగు నృగుం
డూసరవెల్లియై • యుద్భవిలఁడె
పరమసామ్రాజ్య స • ర్వాధికారము నొంది
పుట్టఁడే నహుషుండు • భుజగమగుచు
నీ కెంత యభిమాన • నిలయమైనను యుధి
ష్ఠిరుఁడు గాంచఁడె దండ • ధరుని పురము
నారదసంయమి • నారియై జన్మించి
వసుధలో సంతతి • వడయలేడె

తే॥ గీ॥ ఎవరి ప్రారబ్ధమును ద్రిప్ప • నెవరితరము
గాని పరిపూర్ణ కృప నీకుఁ • గల్గియున్న
నెంత ప్రారబ్ధమైన మ • మ్మేమిసేయు
సురుచిరవిలాస లశునాఖ్య • పురనివాస
చన్నకేశవదేవ వి • శాలభావ. 84

సీ॥ భక్తిమార్గమెఱుంగఁ • బడఁజేయని యతండు
గురువుగా డొక పాడు • దొరువుగాని

భవదీయనామ మై ♦ భవముఁ జాటని దొక-
విద్యగాదది మోక్ష ♦ విద్యగాని
భర్తతత్వ మెఱింగి ♦ పల్క నేరకయున్న
భార్యగాదది ప్రాణ ♦ హార్యగాని
ధర్మమార్గముఁ దప్పి ♦ తగవుఁదీర్చునతండు
పెద్దగాఁడొక గ్రుడ్డి ♦ గద్దగాని
తే॥ గీ॥ నిమిషమాత్రంబు నిను మది ♦ నిల్పకున్న
నరుఁడుగాఁడొక వెఱ్ఱి వా ♦ నరుఁడుగాని
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్న కేశవదేవ వి ♦ శాలభావ. 85

సీ॥ మంచిచెడ్డ లెఱింగి ♦ సంచరింపకయున్న
పురుషున కిహమందు ♦ భుక్తిసున్న
పొరుగున జామాత ♦ పూని కాపురమున్న
భాగ్యవంతుల కెల్ల ♦ బ్రతుకుసున్న
దారిద్ర్యమున భార్య ♦ తగవులాడుచునున్న
నభిమానులకు జీవి ♦ తాశసున్న
పతివరభామినీ ♦ రతులఁదేలుచునున్న
వనితాలలామకు ♦ వయసుసున్న
తే॥ గీ॥ సుతుఁడు చెడుగైన నిహపర ♦ గతులుసున్న
మిమ్ము మది నమ్మకున్న మో ♦ క్షమ్ముసున్న
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్న కేశవదేవ వి ♦ శాలభావ. 86

సీ॥ శిల్పి సంకల్పించి ♦ చేసిన శిల దివ్య
మంగళరూపమై ♦ మారుఁగొనదె
శుకమును దెచ్చి యో ♦ పికతోటి సర్వశా
స్త్రములు చెప్పిన నది ♦ చదువుకొనదె
హయమును శిక్షఁజే ♦ యఁగఁ దాళగతులకుఁ
దప్పక వర్తించి ♦ మెప్పుఁగనదె
కొండకోతినిబట్టి ♦ దండించి నేర్పిన
నిల చిత్రకృత్యము ♦ ల్నేర్చుకొనదె

తే॥ గీ॥ ధర మహాపాపినౌ నన్ను ♦ దాస దాస
కోటిఁ జేర్పఁగ యత్నించు ♦ కొనఁగఁదగదె
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 87

సీ॥ ఖలులట్టలున్నీరు ♦ గణముచేఁ దలఁదాల్పఁ
బడియు వక్రగుణంబు ♦ విడువకుండు
భృత్యావలి ప్రత ♦ న్మూర్ఖులు ముకురముల్
జనులనువ్యత్యయం ♦ బున గ్రహించు
దురు పానహంబులు ♦ దుష్టింకరులు స్నేహ
మందియు పదభంగ ♦ మొందఁజేయు
పక్షిగతత్వంబు ♦ నందియున్నను దుర్జ
నాంజనాకారంబు ♦ లరయరాదు

తే॥ గీ॥ ఇభము లతినీచమానసు ♦ లెపుడు దమకు
వృద్ధికారణమైన భూ ♦ భృద్విభగ్న

మునకె యత్నించుచుండు నీ ♦ భువి నిజంబు
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్న కేశవదేవ వి ♦ శాలభావ. 88

సీ॥ కాలాహినిజఫణా ♦ గ్రములనుండు గరంబు
సరగునఁ బిండఁగైఁ ♦ జాచినట్లు
బడబాగ్ని నవలీలఁ ♦ బట్టిమ్రింగుటకునై
నరుఁ డొక్కరుఁడు నోరు ♦ తెఱచినట్లు
ఆఁకొని గుహనున్న ♦ హర్యక్షముం జేరి
తజ్జటల్మొలివెట్టఁ ♦ దలఁచినట్లు
జ్వాలావిలోలమౌ ♦ కాలకూటవిషంబు
రుచిఁజూడ నువ్విళు ♦ లూరినట్లు

తే॥ గీ॥ గాదె మీపాదభక్తి సం ♦ కలితులైన
బుధుల కపకృతిఁగావింపఁ ♦ బూనియుంట
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్న కేశవదేవ వి ♦ శాలభావ. 89

సీ॥ తపముసేయఁగఁ బర్వ ♦ తాగ్రభాగమువీడి
యూషరక్షేత్రమం ♦ దుండురీతి
యేలారజఃపూరి ♦ తేక్షు సారమువీడి
యతితిక్తరసముఁ ద్రా ♦ గతుకురీతి
ఘనరత్నఖచిత కం ♦ కణజాలమునువీడి
వన్నెగాజులు దాను ♦ గొన్నరీతి

షడ్రసోపేతమౌ ♦ శాల్యోదనము వీడి
జొన్నసంకటిఁ గోరి ♦ తిన్నరీతి

తే॥ గీ॥ గావె నిను వీడి యజ్ఞాన ♦ వాదులౌచు
నరులు దిరుగుట దేవతాం ♦ తరమునందు
మానసములుంచి ముక్తికై ♦ దీనబంధు
సురుచిరవిలాస లకునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 90

సీ॥ కరుణాస్వభావుఁడై ♦ కష్టించి నను బెంచి
యొజ్జలకొలుపున ♦ కొప్పగించి
నేర్పించి సాహిత్య ♦ నిగమాగమంబులు
వరుస నన్నొకయింటి ♦ వానిఁ జేసి
సతతము నావ్యథా ♦ సంతసంబులలోనఁ
జాలిన కూర్మితోఁ ♦ బాలుగొనుచు
ఋణమైన నన్వీడఁ ♦ జాలని మత్సహో
దరుఁడు శేషాచార్య ♦ వరుఁడు లేని

తే॥ గీ॥ కొఱఁత నాకెట్లు దీర్పఁగాఁ ♦ దలఁచి యిపుడె
సంభ్రమంబున దేవర ♦ సన్నిధాన
మునకుఁ జేర్చితి వైహికం ♦ బులకుఁ బాపి
యింతలో నిట్లొనర్తువం ♦ చెఱుఁగనైతి
సురుచిరవిలాస లకునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 91

సీ॥ తత్పుత్రులకుఁ జిన్న ♦ తన మింకఁ దీరలే
దని మది విశ్వాస ♦ మునిచినావె
భవదంకితముచేయఁ ♦ బడిన యీ శతకమం
తయు వినునట్లుకైనఁ ♦ దాళినావె
గానరూపంబుగాఁ ♦ దా నొనర్చిన రామ
కథఁబాడఁ గొన్నాళ్ళు ♦ గడపినావె
ప్రణమిల్లి నీకు నేఁ ♦ బయనమై యరిగిన
నొప్పగింతలకైన ♦ నోర్చినావె

తే॥ గీ॥ ఇంతతొందరపడితి వి ♦ దేమి చిత్ర
మకట మత్ప్రియ సోదరు ♦ నవనిఁబావ
నెట్లు ద్రిమ్మింగుదు నీ దుఃఖ ♦ మేమిసేతు
హరిహరీ యెంత దుష్కాల ♦ మరసిచూడ
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 92

సీ॥ ఇప్పించితివి ధరి ♦ త్రీశ్వరతతిచేత
నెనలేని గౌరవం ♦ బెపుడు సభలఁ
జెప్పించితివి సర్వ ♦ దిక్కులలోఁ బేరు
వైద్యలోకాచార్య ♦ వర్యుఁడనుచుఁ
గప్పించితివి మేనఁ ♦ గర్బురాంచలయుక్త
కౌశేయముద్దేవ ♦ క్రతువులందు
రప్పించితివి ప్రాజ్ఞ ♦ రాజిని మైత్రిచేఁ
దనచెంత కనిశంబు ♦ వినయమొప్ప

తే॥ గీ॥ అట్టి మామకసోదరుం ♦ డైన శేష
విబుధసత్తము నడఁబాపి ♦ వితతశోక
సాగరంబునముంచితే ♦ స్వామి నన్ను
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 93

సీ॥ త్వత్పార్షదులొకటి ♦ తరణిబింబోజ్జ్వలం
బగు విమానోత్తమం ♦ బందు నుంచి
సురదుందుభుల్మ్రోయ ♦ వరసిద్ధసాధ్య గం
ధర్వులు జయజయ ♦ ధ్వనులుసేయ
దరహాసముఖులౌచుఁ ♦ గరమనురక్తి రం
భాదులు దివ్యనా ♦ ట్యంబుసల్ప
తత్పుణ్యతతిఁ బురం ♦ దరుఁడు సంశ్లాఘించి
తలయూఁచి యెదురుగాఁ ♦ దరలిరాగ
క్రతుభుజుల్గుమిగూడి ♦ కైవారములొసఁగి
కూర్మితోఁ గురియింపఁ ♦ గుసుమవృష్టి
దశదిశల్వెలుఁగంగఁ ♦ దరణిబింబవిభేద
మొనరించి క్రమముగా ♦ నూర్ధ్వలోక
సముదయమునుదాటి ♦ సర్వదేవాలక్ష్య
మై సనాతనమగు ♦ న ప్రమేయ
మహిమానుభూయమై ♦ మహితహేమవికార
ద్వారచతుష్టయా ♦ వరణగుప్త
మై విరాజిలుచుండి ♦ మహనీయ గోపుర
శతసహస్రముగల్గి ♦ సతతవికచ

హైమాంబుజాకర్ణ ♦ మగు సుధారససరి
చ్ఛతకోటిచే నలం ♦ కృతమునైన
దివ్యలోకముఁ జేర్చి ♦ దేదీప్యమానకో
ట్యర్కాభమై యందు ♦ నలరుచున్న
తపనీయద్వాదశ ♦ తలయుతంబగు విమా
నోపకంఠమునందు ♦ నునిచి నిత్య
సూరులు వెఱఁగొంది ♦ చూచి సంతోషింప
నపుడు దేవీభూష ♦ ణాయుధముల
నవధరించి పితామ ♦ హాది దైవత పరి
చర్యలందుచు శేష ♦ శయనమందు
వేంచేసియున్న మీ ♦ విమల పాదసరోజ
వరయుగ్మసన్నిధిం ♦ బరమపావ
నుని మత్సహోదరు ♦ నునిచినఁ గరుణార
సాయతాపాంగ ధ ♦ న్యాత్ముఁ జేసి
దరహాసచంద్రికా ♦ ధవళితనిజతను
కాంతికాంతుండవై ♦ శాంతముగను
శోభ వానని మీరు ♦ కూర్మితో నడుగంగ
భవదీయుఁడ నటంచుఁ ♦ బల్కి మోద
జలకణపరిపూర్ణ ♦ చక్షుఁడై ప్రణమిల్లి
నిగమోక్తసన్మంత్ర ♦ నిచయమునను
నుతియించి పరవశ ♦ మతుఁడై ద్వయంబను
సంధించుచున్న మ ♦ త్సహజుఁగాంచి

శ్యామలత్వ చతుర్భు ♦ జత్వాది లక్షణం
బులఁ బరమాదరం ♦ బున నొసంగి
భవదంఘ్రి కైంకర్య ♦ పదవిం బ్రసాదించి
కరుణించియుంచితే ♦ ఘనచరిత్ర
తలపోయ మా సహ ♦ దరుని శేషవిచక్ష
ణుని గూడినంగాని ♦ వనజనాథ

తే॥ గీ॥ శేషిశబ్దము నీయందుఁ ♦ జెంది సుస్థి
రంబుగాదని యనవస ♦ రంబునందు
నింతచేసితి కాఁబోలు ♦ నెంత యుక్తి
పరుఁడవోగాని నిన్నెట్లు ♦ ప్రస్తుతింతు
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ ♦ విశాలభావ. 94

సీ॥ మీపాదచింతనా ♦ మృతవృష్టి లేక యీ
భవదావశోష నేఁ ♦ బాయఁగలనె
పరమేశ నీదివ్య ♦ భక్తిప్లవము లేక
యఘమహార్ణవపార ♦ మందగలనె
భవదీయ కైంకర్య ♦ భాస్కరప్రభ లేక
యజ్ఞానతమము నే ♦ నడఁచఁగలనె
త్వత్కథాసల్లాప ♦ దంభోళి లేక ష
డ్రిపునగంబుల సంహ ♦ రింపఁగలనె

తే॥ గీ॥ ఏమిచేసెదొ నన్నెట్టు ♦ లేలుకొనెదొ
దళితరిపుజాల మృగమద ♦ తిలకఫాల

సురుచిరవిలాస లసునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 95

సీ॥ సతత ప్రీతామృతా ♦ స్వాస్థచిత్తసురౌఘ
ము సంజేర్చి స్వర్లోక ♦ మున నెయుంచు
జననమరణక్లేశ ♦ మనుభవించెడు జీవు
లను జేర్చి భూలోక ♦ మున నెయుంచు
నిరితరాంధ్రాన్వేష ♦ నిష్ఠపన్నగ కులం
బునంజేర్చి పాతాళ ♦ మున నెయుంచు
మతినసన్నహావ్యధ ♦ లంది ఘోషిలు పాపు
లను జేర్చి రౌరవం ♦ బున నెయుంచు

తే॥ గీ॥ మెచటనుంచిన నీభక్తి ♦ నెపుడు విడువ
నట్టు కృపసేయు వరము నా ♦ కెట్టులైన
సురుచిరవిలాస లసునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 96

సీ॥ దేవరశ్రీపాద ♦ దివ్యభక్త్యున్మేష
మధుర సుధారస ♦ మాని దృప్తిం
జెందిన మామక ♦ జీవితంబంతయు
సరసీరుహాక్ష నీ ♦ సమ్ముఖమున
నంజలిఘటియించి ♦ నమ్రశిరస్కుండ
నై బాష్పపూరిత ♦ నయనయుగళ
మునుగల్గి మేన్గగు ♦ ర్పొడువ గద్గదికతో
భవదీయ సుగుణ వై ♦ భవముం దలంచి

తే॥ గీ॥ మాటిమాటికిఁ బరవశ ♦ మానసుండ
నగుచుఁ జరుపఁగఁజూడు నా ♦ కన్యమేల
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 97

సీ॥ తరణిబింబము నెప్పు ♦ డరవిందములుమాడ్కి
నీమూర్తిఁగనఁగోరు ♦ నేత్రయుగము
స్తోకకంబంతరి ♦ క్షోదకంబునుబలె
శ్రీపాదతీర్థంబె ♦ జిహ్వగోరు
దందశూకంబులు ♦ దారగీతముఁబోలె
శ్రవణముల్గోరు మీ ♦ సత్కథాళి
నంబుదంబును మయూ ♦ రంబులైవడి భవ
చ్చరణ నీరజధూళి ♦ శిరముగోరు

తే॥ గీ॥ కడకు నను రౌరవాది లో ♦ కములఁద్రోసి
కష్టపెట్టెదో దేవర ♦ కడకుఁదీసి
నిత్యకైంకర్య మొసఁగెదో ♦ నే నెఱుంగ
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 98

సీ॥ ఎటుద్రిప్పినను ద్రిప్పు ♦ మిచ్చవచ్చినయట్లు
శ్రీభాగవతగోష్ఠిఁ ♦ జెందఁజూడు
మేమిచేసినఁజేయు ♦ మెవ్వేళ లనుభవ
త్పరిచర్యలం దాస ♦ పడఁగఁజూడు
మెందుఁద్రోసినఁద్రోయు ♦ మిందిరాధవతమో
గుహఁబడి చింతిల ♦ కుండఁజూడు

మేదిగూర్చినఁ గూర్పు ♦ మో దయానిధి దుర
హంకృతి ననుఁజేర ♦ నట్లుచూడు
తే॥ గీ॥ మెన్నికష్టంబు లిచ్చిననిమ్ము ♦ మెపుడు
నిను దలంచుచు దాసోహ ♦ మనఁగఁజూడు
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 99

సీ॥ కటకుటమ్ముల మిమ్ముఁ ♦ గప్పిన భీష్ముపై
జాలినొందినమాట ♦ జ్ఞప్తియున్న
భల్లుకేశ్వర ముష్టి ♦ ప్రహరంబులకు సైఁచి
కరుణఁగాంచిన మాట ♦ మరువకున్నఁ
దన్నిన భృగు నెద ♦ నన్నించి లాలనఁ
జేయుట విస్మృతిఁ ♦ జెందకున్న
గురుశిలావృష్టిఁ బైఁ ♦ గురియించిన మహేంద్రు
నరసి బ్రోచినమాట ♦ గురుతుయున్న
తే॥ గీ॥ నస్మదపరాధములు సైచు ♦ టనఁగ నెంత
వంతఁదీరిచి నను గాచు ♦ టెంతవింత
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 100

సీ॥ ఋణపాతకం బెట్లు ♦ నను గష్టపెట్టునో
పనిబూని నీవె కా ♦ పాడుమయ్య
భవసాగరం బెప్పు ♦ డవలీలముంచునో
తప్పించి కృపఁజూడఁ ♦ దలఁచుమయ్య

నను మృత్యు వేక్షణం ♦ బున మోసగింపఁగా
నుండెనో కన్పట్టి ♦ యుండుమయ్య
కర్మశేషం బెట్టి ♦ గతి కీడ్చనో నన్నుఁ
జేయూత నొసఁగి ర ♦ క్షింపుమయ్య

తే॥ గీ॥ నిన్ను విడనాడి జీవింప ♦ నేరనయ్య
ప్రాపువిడకుంట కే నీ ప ♦ రాయినయ్య
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 101

సీ॥ ఆశ్రితావనదీక్ష ♦ నంది వెల్గెడు భవ
త్సవ్యదివ్యపదాంబు ♦ జంబుఁజాచి
తత్సమప్రతిభాయు ♦ తంబగు దక్షిణాం
ఘ్రి సరోరుహంబు నో ♦ క్కింతకుంచి
సవ్యేతరంబైన ♦ జానుతటంబుపైఁ
దద్దివ్యహస్త ప ♦ ద్మంబుఁజేర్చి
యహిరాజభోగ ప ♦ ర్యంకమం దపరక
రంబును హాయలు మీ ♦ రంగనుంచి
వరకరయుగముచే ♦ నరివారమారణ
కరములౌ శంఖ చ ♦ క్రములఁదాల్చి
ఘనసారమిశ్ర శ్రీ ♦ గంధ నవ్యసురత్న
భూషణాంచితుఁడవై ♦ పొల్పుమీర

తే॥ గీ॥ సిరియు భూనీళలును పాద ♦ సరసిజముల
భద్రముగనొత్త నిద్రాభి ♦ ముద్రితుండ

వగుచుఁ బవళించియున్న నీ ♦ దగు విలాప
మూర్తి నెప్పుడు మన్మనోం ♦ బుజమునందు
నిల్పి కృపఁజూడ నెంచు న ♦ న్నల్పుఁడనక
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 102

సీ॥ శుద్ధసాత్త్వికప్రకా ♦ శోదంచితంబైన
పదమునం బరరూపి ♦ వౌచునుండి
ప్రాకృతబ్రహ్మాండ ♦ పంక్తులు సృజియించి
తాల్చి పంచవ్యూహ ♦ తనువు లచట
విశ్వవిఖ్యాతమా ♦ విభవత్వమున మీన
కమఠకోలాది రూ ♦ పములనొంది
తతజీవకోటి హృ ♦ త్తటసార సోదరాం
తర్యామివై సంత ♦ తంబు నిలిచి
తే॥ గీ॥ భుజగశైలాది బహువిధ ♦ భోగ్యదేశ
సమితి నర్చాస్వరూపివై ♦ సంస్మరింప
సకలచేతన రక్షణో ♦ క్షణుఁడవగుచు
నిండియుండిన నీ కిదే ♦ దండ మిదుదు
మఱచినను నేను నిను నన్ను ♦ మఱువకయ్య
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 103

సీ॥ ప్రారబ్ధవశముచేఁ బైఁబడ్డ కష్టముం
బాపి రక్షింప నీ ♦ భారమంటి

జన్మలో నొకపరి ♦ శరణన్న వారల
కభయప్రదుండ వీ ♦ వనుచు వింటి
నే నొనర్చిన పాప ♦ నివహము ల్సైరించి
త్వద్భక్తి నిమ్మని ♦ తలఁచుచుంటి
నాయదృష్టంబుచే ♦ నఖిల దైవత చక్ర
వర్తివౌ నీయందె ♦ వాంఛఁగొంటి
తే॥ గీ॥ చిత్తశుద్ధికి భంగంబుఁ ♦ జేయకంటి
నమ్మియుంటిని నిన్నదిం ♦ దమ్మికంటి
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 104

సీ॥ భోగిరాడ్భోగోప ♦ భాగరత్నప్రభా
శబలిత నిజకాంతి ♦ సంఘునీవు
లోకైకనుత జగ ♦ ల్లోచనాన్వయ సరి
త్పతికైరవాప్తుఁడై ♦ ప్రాజ్ఞుఁడైన
శ్రీమన్మహారాజ ♦ శేఖరుఁడౌ దశ
రథ సార్వభౌముని ♦ రమణియందు
జన్మించి శ్రీరామ ♦ చంద్రుండవై యొన
ర్చిన దివ్యచరిత వ ♦ ర్ణించి రాఘ
తే॥ గీ॥ వాభ్యుదయమను పేరుతో ♦ వసుధ జన్మ
సార్థకముఁ జేసికొననుంటి ♦ సమయ మరసి
యెట్లు దోడ్పడనుంటివో ♦ యిందిరేశ
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 105

సీ॥ ఒకదివ్యచరణంబు ♦ నొనరుగా ముందిడి
నొగ నొక జానువు ♦ నంచి నిల్చి
సవ్యదక్షిణహస్త ♦ జలజంబులం గశా
జ్ఞానముద్రలఁ బూని ♦ మానితముగ
ప్రణయరసావేశ ♦ భరితమై యొప్పారు
దృక్కుచేఁ బార్థుని ♦ దిక్కుఁ జూచి
లలితకుండలకాంతి ♦ చలితమై యెడనెడ
గండభాగములందు ♦ మెండుకొనఁగ
సకలవేదాంతార్థ ♦ సారమై సంసార
తారమై వెల్గు గీ ♦ తామృతాబ్ధిఁ

తే॥ గీ॥ దేలి యాడించుచున్న మీ ♦ దివ్యమూర్తి
మన్మనస్తామరసపీఠ ♦ మందు నిత్య
వాసముం జేయుఁగాక గ ♦ ర్వాభిభూత
జాత చేతన హరరోష ♦ సూతవేష
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్న కేశవదేవ వి♦శాలభావ. 106

సీ॥ శుభమస్తు తే యశ ♦ శ్శోభిత భువనాయ
విజయోస్తు దరచక్ర ♦ నిజకరాయ
స్వస్త్యస్తు నీహార ♦ పతిమిత్రనేత్రాయ
కల్యాణమస్తు తే ♦ కలిహరాయ
శివమస్తు భవపద్మ ♦ భవనతపాదాయ
మంగళమస్తు తే ♦ మాధవాయ

భావుకమస్తుతే ♦ భవరోగహారణాయ
కుశలంసదాస్తు స ♦ద్గుణగణాయ
తే॥ గీ॥ దాసజనపాలనోత్సాహ ♦ తరళితాంత
రంగవిభవాయ తే నమో ♦ భంగురాయ
సురుచిరవిలాస లకునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 107

సీ॥ దండంబిదే పద్మ ♦ జాండకోటిప్రచండ
ఖండితరిపు శిరః ♦ కాండ నీకు
వందనంబిదె మౌని ♦ బృందవందితలస
త్సుందర చరణార ♦ వింద నీకు
జోహారిదే చతు ♦ ర్బాహాధరజితాంబు
వాహ సందోహ శ్రీ ♦ దేహ నీకు
సాష్టాంగమిదె భక్త ♦ కష్టాపనోద సం
తుష్టాంతరంగ సం ♦ స్పృష్ట నీకు
తే॥ గీ॥ ప్రణతిశతమిదె మోహిత ♦ బ్రహ్మరుద్ర
శక్రముఖ్యాసురారాతి ♦ సంఘ నీకు
సురుచిరవిలాస లకునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 108

సీ॥ నతి నీకుఁ గారుణ్య ♦ మతి దయానిధి భక్త
వత్సల నీపాద ♦ వనజభక్తి
పరవశస్వాంతుండఁ ♦ గరుణతో నన్గావు
మస్మత్పురాతనం ♦ బైన కర్మ

వశము చే జడుఁడనై ♦ మశకకీటాది జ
న్మము లెన్నియో నొంది ♦ మామకీన
కర్మక్షయంబు న ♦ నగ్గొంటి భవదంఘ్రి
పంకేరుహద్వాద్వ ♦ పత్త్రసంబు
నీ సమయం బాది ♦ దాసదాసుఁడ జగ
త్పతి వలదిక నిల ♦ భవము నాకు
భవసాగరోదర ♦ పతితుండనౌ నన్ను
దరిఁజేర్చ మీపాద ♦ సరసిజములు
గాక వేఱొక దిక్కు ♦ గలదె మామక ధన
దారాది బహువిధ ♦ భార మిపుడ

తే॥ గీ॥ శ్రీ జనార్దన నీయందుఁ ♦ జెందఁజేసి
యుంటి శరణాగతుండనై ♦ యుష్మదంఘ్రి
సేవనొనగూర్చి వేగ ♦ రక్షింపుమయ్యా
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 109

సీ॥ అథవ శ్రీ వైఖాన ♦ సాన్వయ కలశాబ్ధి
పూర్ణసుధాకర ♦ మూర్తియైన
శ్రీరామదేశిక ♦ సూరివర్యుఁడు గలం
డఖిలార్థవేది మో ♦ హప్రభేది
తద్ధర్మపత్నియై ♦ దనరు లక్ష్మీనర్స
మాంబకు నేఁ దృతీ ♦ యాత్మజుండ
మహిఁ శ్రీభరద్వాజ ♦ మౌని గోత్రుఁడ భవ
త్పద నీరజార్చనా ♦ ప్రముదితుండ

సర్వేశ రామాను ♦ జాభిధానుండ మీ
సహజకోమల కృపా ♦ సముదయమునఁ
గూర్చియొసఁగినాఁడ ♦ నోర్చి లోపములున్నఁ
గైకొని యీశత ♦ కంబు నన్నుఁ

తే॥ గీ॥ గరుణఁ గృతకృత్యుఁ జేయుమో ♦ ఘనఘనాంగ
రక్షితామర సామ్రాజ్య ♦ లసదపాంగ
సురుచిరవిలాస లశునాఖ్య ♦ పురనివాస
చన్నకేశవదేవ వి ♦ శాలభావ. 110



## —* తప్పొప్పుల పట్టిక. *—

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 9 | వాడనో | వాఁడనో |
| 3 | 21 | లగ్జలం | లగ్జైలం |
| 5 | 19 | పాథోధి | పాథోధి |
| 7 | 18 | రుణ ♦ వీక్షిం | రుణ వీ ♦ క్షిం |
| 10 | 15 | కస్టాఘ | కష్టాఘ |
| 20 | 4 | గొప్పనెంత | కులమదెంత |
| 26 | 8 | బాగ్య | భాగ్య |
| 28 | 4 | తండవ | దండవ |
| 32 | 19 | గనువేళ | కనువేళ |
| 35 | 15 | ష్టములు నీ ♦ వ | ష్టాఘంబు ♦ న |
| 42 | 13 | పాలుజే | పాలుచే |
| 48 | 12 | షిరుఁడు | ష్ఠిరుఁడు |
| 55 | 1 | కర్ణ | కీర్ణ |

---